

# అంకితము

—:0:—

సత్కార్య శూరులును, స్వదేశోద్ధారకులును, బరోపకారులును నగు సంఘసంస్కారుల కీకృతి నంకితము చేయుచున్నారము.

ఇట్లు విన్నవించు, సుధీజన విధేయులు,

ముట్నూరి వేంకటసుబ్బారాయడు,

మంగిపూడి వేంకటశర్మ,



॥ వందేమాతరం ॥

---

# బాలవితంతువిలాపము

సీ॥ శృంగారవతికి ముంగొంగు బంగారంబు । కీరభాషిణికిఁ పంగేట్టిజన్న
కిసలయాధరకు ముంగిటి కల్పభూజంబు । పువ్వారుఁబోఁడికి పూలకానము
హరినీలవేణికి నరచేతిరత్నంబు । ధవళలోచనకు సుధారసంబు
యువతికిఁ బెరటిలో నున్న వేలుపుటావు । భాసురాంగికిమంచి పసరుంజుము

గీ॥ మహితచరితకు దివ్యసామ్రాజ్యపదవి
ప్రాణనాథుండుసతి, కట్టిపతియెలేని
జాణతనమేల? సొగసేల? సౌఖ్యమేల?
జవ్వనంబేల? జగమేల? జన్మమేల?

సీ॥ ధనమేల? నెఱజాణతనమేల? బలుగాణతనమేల? పతిలేని తరుణులకును
విరులేల? వెలలేని సరులేల? దరిలేని సిరులేల? పతిలేని చెలువలకును
హితులేల? ప్రియబంధుతతులేల? గుణసింధుసుతులేల? పతిలేనిసుదతుల
కును
నగలేల? జిగిజిల్కు తొగలేల? తమిగుల్కు వగలేల? పతిలేని వనితలకును

గీ॥ భోగ్యవస్తువు లవియేల? భాగ్యమేల?
రాజ్యమదియేల? ప్రాజ్యసామ్రాజ్యమేల?
క్రీడలవియేల? మిద్దెలు మేడలేల?
విద్యలవియేల? పతిలేని వెలఁదులకును

# బాల వితంతు విలాపము.

సీ॥ పూర్ణచంద్రునివంటి ముఖవిలాసముగల్గి । కలువరేకుల నేలు కనులు గల్గి
మహితచంద్రికఁ బోలు మందహాసముగల్గి । యిరులఁ గేరడమాడు కురులు గల్గి
తమ్మికెంపులమించు దంతకాంతులుగల్గి । సంపెంగను గేరు నాసగల్గి
చిగురుటాకుల గెల్వఁదగు కరంబులుగల్గి । మేల్మిబంగరుచాయ మేనుగల్గి

గీ॥ చిలుకవలె ముద్దు చిలికెడు పలుకుగల్గి
నెఱతనము గల్గి విద్యల నేర్పుగల్గి
మగఁడులేకున్న యట్టి యమ్మగువసొగసు
కానఁ గాసినవెన్నెల కరణిఁగాదె?

సీ॥ చంద్రికలేనట్టి చంద్రుని చందంబు । నీరులేనట్టి కాసారమట్లు
కీలూడినట్టి పాంచాలిక పోలిక । ఘనకళలేని చిత్రమట్లు
ప్రాణంబులేని కాయంబు విధంబు । కలికి పల్కులులేని చిలుకరీతి
తంతులులేని నిద్దపు వీణకైవడి । ప్రతిబింబరహిత దర్పణముకరణి

గీ॥ పక్షయుగ్మంబు తెగినట్టి పక్షిభంగి
తెప్పకొయ్యలులేనట్టి తెప్పకరిది
చక్రములఁ బాసి యున్నట్టి శకటముగతి
విభుఁడులేనట్టి వెలఁదియు వ్యర్థము గాదె?

సీ॥ అన్నంబు సున్నంబు హారంబు భారంబు । కేకులు కాకులు గృహము గ్రహము
దీపంబు తాపంబు రూపంబు పాపంబు । సరసంబు విరసంబు జగము నగము
చూతంబు భూతంబు శుకములు బకములు । గారంబు ఘోరంబు కథలు వ్యథలు
ప్రాయంబు హేయంబు పలుకులు ములుకులు । కుసలముల్ ముసలముల్ పసిఁడి ముసిఁడి

ఆ॥వె॥ పికము వృకము లతలు వెతలు మణుల్ ఫణుల్
నగలు సెగలు తొగలు పగలు పువ్వులు
పవ్వు చెవులు పులులు వసనముల్ వ్యసనముల్
బ్రతుకె యతుకు విగతపతికలకును 5

సీ॥ చక్కఁదనంబున్న జవ్వనంబున్నను । బతిలేనికాంత జీవితము గతము
జాణతనంబున్న గాణతనంబున్నఁ । బతిలేనికాంత జీవితము గతము
అతులభాగ్యంబున్న నారోగ్యమున్నను । బతిలేనికాంత జీవితము గతము
ఆప్తబంధువులున్న నాత్మ మిత్రులున్నఁ । బతిలేని కాంత జీవితము గతము॥

గీ॥ వివిధ విధ వైభవములున్న వినయమున్న
విద్యలను నేర్చియున్న వివేకమున్న
దివ్యతరకీర్తి యున్న సచ్ఛీలమున్న
క్షితిని బతిలేనికాంత జీవితము గతము

సీ॥ ఏపనిఁ బాటింపని కరములు కరములే? । రసహీన శాఖోత్కరములు గాక
సఖులతో సరసంబు లబ్బఁ జాలని వాయి । వాయియే? బిలప్రదేశము గాక
విభుని భాషణములు వినలేనియా చెవుల్ । చెవులగునే? కొండగవులు గాక
ప్రాణేశు నందంబుఁ బరికింపఁగాలేని । కనులు కన్నులె? నోపఖవులు గాక

గీ॥ పతికి సుఖముఁ గూర్చు భాగ్యంబుఁ గాంచని
మేను మేనె? పెద్దమ్రాను గాక
భర్తతోడి సుఖముఁ బడయంగ లేని జీ
వనము జీవనంబె? వనము గాక 7

సీ॥ కబళంబు భుజియింపఁ గా జిహ్వ కింపౌనె? । నాథుండు లేనియే నాతులకును
అరగంట నేని నిద్దుర నొందవచ్చునే? । మగఁడు లేనట్టి వామాక్షులకును
మదికి నెమ్మది యొక్క మాటైనఁ గల్గునే? । ధవుఁడు లేనట్టి సద్యాక్షులకును
సఖుల సాన్నిధ్యంబు సౌఖ్యంబు గూర్చునే? । యధిపతి లేని లోలాక్షులకును

గీ॥ తరమె? చల్లార్చ ఘోర సంతాపవహ్ని
రమణుఁడే లేని యమ్మదిరాక్షులకును
నిల్పశక్యమె? తను వరనియమమైన
నధిపుడే లేని యబ్జశాలాక్షులకును

## బాలవితంతు విలాపము.

సీ॥ మనుజులందఱన్యోన్యమై త్రిబాంధవ్యములఁ | గలుగుటకై యేది కారణంబొ?
పశుసమానులుగాక శిశువులు సుపుత్రులై | గా్రిలుచుండుట కేది కారణంబొ?
స్త్రీపురుషులు నెల్లి చేఁగట్టుపడుచు నే | కత మెలంగుట కేది కారణంబొ?
పురుషులున్ స్త్రీల్పరస్పరముఁ గార్యములందుఁ | దోడ్పడుట కేది కారణంబొ?

గీ॥ అట్టిపరిణయ బంధంబు నందుమూర
సృష్టిభవితవ్యమును విచారింపఁబోక
పైకమిచ్చిన వారికే బాలికలను
గట్టిపెట్టుట యిది యెట్టికర్మ? మకట! 9

సీ॥ దేహదార్ఢ్యముగల్గ ధీబలోద్భవముంపఁ | దగినసాధనము సత్పరిణయంబు
అనుసమానకులాంకు రాగ్రిబుద్ధులఁగల్గఁ | దగినసాధనము సత్పరిణయంబు
జన్మదేశాభిమానోత్సాహచిత్తులుగల్గఁ | దగినసాధనము సత్పరిణయంబు
లోకమాతృదేశ భక్తాగ్రగణ్యులుగల్గ | దగినసాధనము సత్పరిణయంబు

గీ॥ అట్టిపరిణయములఁ జేయు పట్టులందు
నీడుజోడును మున్నుగాఁ జూడఁబోక
పైకమిచ్చినవారికే బాలికలను
గట్టిపెట్టుటయిది యెట్టికర్మ? మకట!

సీ॥ ఐకమత్యముఁ గూర్చి యవనీతలం బెల్లఁ । గట్టంగఁ జాలు పగ్గంబు పెండ్లి
ఇహపరలోక సౌఖ్యైక దాయకముగాఁ । దనరారు మేటిసాధనము పెండ్లి
కాలక్రమాగత కష్టసాగరముల । దాఁటింపఁ జాలిన తరణి పెండ్లి
ఆమయదుఃఖంబు లణఁచి సౌఖ్యంబుగాఁ । జీవింపఁ జేయు సంజీవి పెండ్లి

గీ॥ అట్టి పెండ్లిండ్లు చేసెడు పట్టులందు
సూక్ష్మమతి దూరదృష్టులఁ జూడఁబోక
దంపతుల భావిగతులఁ దలంపఁబోక
వేగిరింతురు కొందఱు వెఱ్ఱు లకట! 11

సీ॥ వైవాహికంబు లెవ్వరి సౌఖ్యసంతోష । ములనిమిత్తములుగాఁ దలఁపఁ బడెనో?
వానిలోపమున నెవ్వరు కలకాలంబుఁ । గష్టముల్ పొందంగఁ గలుగువారో?
తమజీవితమున సాధక బాధకములను । దలపోయ నెవ్వారు తగినవారో?
ఐహికకష్టసౌఖ్యంబులం దెవ్వారు । తగఁ బాలుపంచుక తనరువారో?

గీ॥ అట్టిదంపతుల పరస్పరాభిలాష
నెమ్మిఁగనుఁగొనకయె యక్రమమ్ముగాను
దల్లిదండ్రులె స్వాతంత్ర్య మెల్లఁదాల్చి
చేయుచున్నారు పెండ్లిండ్లు చెనఁటు లకట!

సీ॥ పొత్తిళ్లలోనున్న నెత్తురుకందుల । పెండ్లిండ్లు సేయ భావించువాఁడు
పురుడు వోవకమున్నె జోడైలనమ్మఁగ । బేరసారములఁ గావించు
వాఁడు
కన్నులు తెఱవని పసుగాయలనుగట్టి । పెట్టివృద్ధులను సేవించువాఁడు
పాలైన విడువని పసికూనలనుగూర్చి । వైరాగ్యబోధ గావించువాఁడు

ఆ॥వె॥ అత్త తాతయమ్మ యనుతొక్కుపలుకులే
పలుకలేనిచిన్ని పాపలకును
రామ రామ! ముందు రానున్న దెంచక
చెఱఁటియగుచుఁ బెండ్లి సేయువాఁడు 13

సీ॥ మంచి సంబంధంబు మఱి వచ్చునో? లేదో? । యంచు లోలో సంశయించి
యొకఁడు
కట్నంబు ముందింతకంటెను నధికమా । వలయునో? యంచు భీతిలి
యొకండు
మనము పూర్వాచారమును మానఁగా నేల? । యంచు డెందమున యో
జించి యొకఁడు
చిఱుతనాఁడే పెండ్లి చేసిన గుణవంతు । లై ప్రతిష్ఠను దెత్తు రంచు
నొకఁడు॥

గీ॥ పెండ్లిలోపలఁ బెండ్లిఁ గావింతుమేని
కలసి వచ్చును కర్చని తలఁచి యొకఁడు
దంపతుల భావి సౌఖ్యముల్ దలఁపఁ బోక
చేయుదురు పెండ్లి మూర్ఖులై చిఱుతలకును॥ 14

సీ॥ కన్నులారంగ మాంగళ్య ధారణము నె | న్నఁడు చూతునో? యంచుఁ
బొంగి పొంగి
చేతులారఁగఁ బెండ్లి చేయఁగల్గుట యెన్నఁ | డో? యంచు నువ్విళు
లూరి యూరి
చెవులార విను టెన్నఁడో? చిఱుత యల్లుఁడు పల్కు | మృదువాక్యములనుఁ గోర్కె
లెంచి యెంచి
మనసారఁ బిట్టాలఁ బసియింతు విందుల | చేసెన్నఁడో? యని యూహ
చేసి చేసి॥

ఆ॥ వె| భూరి దక్షిణలను భూమిసురులఁ దన్పి
యాశముఁ గాంచు టెప్పుడో? యని మదమునఁ
దోఁగి తోఁగి త్వరను బాగోగు లరయక
చేయుచుంద్రు పెండ్లి చిఱుతలకును॥ 15

సీ॥ గడప యెప్పుడు పచ్చగా నౌనో? యని చూడ | వాచి యున్నవి నాదు
లోచనములు
ద్వారమం దెన్నఁడు తోరణం బుండునో? | యని చూడ ముచ్చట యగును
నాకు
వియ్యంపు నడపులు వేడ్కతో నడుపంగ | సారె సారెకుఁ గోర్కె
సాగు నెపుడు
వలను గా మన పాప తలఁ బ్రాలు చూడంగ | నుల్లమం దువ్విళు లూరు
చుండు॥

గీ॥ కాంక్షఁ దీఱంగ నల్లుని కాళ్ళు గడిగి
ధన్యతను గన్యకను బ్రీతి ధారవోసి
వేడ్కఁ జూడ వేడ్క యటంచు విభుని వేఁడి
చేయుదురు పెండ్లి ముద్దులుచి ఱుతలకును॥ 16

సీ॥ ముద్దు ముచ్చట దీఱ ముక్కు ముక్కర యైనఁ । బెట్టఁ డీమగఁడంచుఁ దిట్టి తిట్టి
గనినలో నగలకై గవ్వైన మిగులదు । నడపీనుఁ గితఁడంచు నవ్వి నవ్వి
తోడివార్న గలతోఁ దులఁ దూగ మోడునై । యే నేడ్పు పలెంచు నేడ్చి యేడ్చి
వంటకంబును విస్తరంటులో నిడి జాగ । యై యుష్టఁ గన్యమ్ము లాఁడి యాఁడి

గీ॥ విభుని ప్రాణాలు విసిగించి వేచి తినెను
నట్టి ప్రత్యక్ష రాక్షసు లైన యాండ్రు
పోరుఁ బడలేక యధములై బొట్టి యలను
అమ్ము చున్నారు కటకటా! యపయులగుచు॥ 17

సీ॥ తనకు సొమ్ములు వచ్చునను సంబర మెకాని । తనయ సొమ్ముల మాటఁ దలఁప దెపుడు
తనకుఁ గోకలు వచ్చునను సంతస మెకాని । తనయ కోకల మాటఁ దలఁప దెపుడుఁ
తనకు రైకలు వచ్చునను కౌతుక మెకాని । తనయ రైకల మాటఁ దలఁప దెపుడుఁ
తనకు రూకలు వచ్చునను హెచ్చరికకాని । తనయ రూకల మాటఁ దలఁప దెపుడు

గీ॥ అకట! ముక్కు పచ్చ లారని పసిపాప
నంగడికినిఁ బంపి యమ్మినట్లు
స్వార్థ పరత శుల్క మాసించి యమ్మెడు
తల్లి సుతల పాలి భిల్లి కాదె? 18

సీ॥ కలిమి లేముల మాటఁ గలనైనఁ దలఁపరు । శ్రీయుత శీలంబు జాడఁ బోరు
తెలివి తేటల సంగతిని విచారింపరు । సద్గుణైశ్వర్యంబు చాయఁబోరు
సంప్రదాయంబు వంశంబుఁ జింతింపరు । ప్రాయంబు చందంబు రోయఁ బోరు
విద్యయు గరిమంబు వివరించి చూడరు । సోయగంబుఁబరీక్ష సేయఁబోరు

గీ॥ జాతి చూడరు వాదుల జాడఁగనరు
జంపతుల మానసంబు లేచందమనను
గలియు ననుకొందురో గాని కరుణమాని
శుల్కమున కమ్ముచున్నారు సుతల నకట! 19

సీ॥ పీటపైఁగూర్చుండఁ బెట్టినవేళను । మాతకై పెండ్లి కుమారుఁడేడ్వ
తాళిఁగట్టెడువేళఁ బాలకై పోర్వెట్టి । గోలుగోలునఁ బెండ్లికూఁతురేడ్వ
వరుఁడు సూత్రము ముడివైవ లేఁడని పురో । హితుఁడె కన్యకుఁ దాళిఁ నెలమిఁగట్ట
తలఁబ్రాలవేళ భీతిల బాలదంపతుల్ । వసవారావేడ్క జరగఁజేయ

గీ॥ అలరి పురమేగఁ బల్లకియందుఁగూరు
చుండఁ జేయంగ నిద్రించుచుండు చిన్న
కందులకుఁ బెండ్లి సేయుటకంటె లక్క
బొమ్మలకుఁ జేసి ముచ్చటల్ పొందరాదె?

సీ॥ అన్నమో రామచంద్రా! యంచు నేడ్చిన । పుట్టిక కరఁటిసంతు చేతఁజిక్కి
కూసలతో నాఁడుకోఁబోదునని యేడ్చు । తల్లిని బొమ్మలను ముందరిను
పైచి
పెద్ద మగనిఁజూచి భీతిల్లి యేడ్చుఁ । స్వామి మంచిమాటల బుజ్జగించి
కంతుఁబూను బాళిఁగట్టఁబోవఁజూచి । యని యేడ్పు పెల్లు నవుడుఁ
దీర్చి

గీ॥ మఱియు నెన్నెని విధముల మాటిమాట
కేడ్చు బిడ్డలయేడ్పు లెట్టెట్టొ యుడిపి
బలిమిచేఁ దల్లిదండ్రులు సలుపునట్టి
పెండ్లియును పెండ్లియే? పెద్ద పెండ్లిగాక ॥ 21

సీ॥ మొదట బాలాకష్టములఁ బ్రాణభయములా । గంపంచు లెక్కైనఁ బడమ
నేని
సదమల విద్యాలసద్గుణవ్యాప్తికి । సంపూర్ణ విఘ్నంబు సంభవించు
సమకళా గుణమయ సౌందర్య మహితులు । కారని డెందముల్
గలియుటపుడు
డెందముల్ గలియకుండిన రాజకీయముల్ । జనకృత్యంబులు సాగఁబోవు

గీ॥ జగడములు గల్గు నిరతంబు జంపతులకు
దాన సంసారమున రక్తి తగ్గిపోవు
దోసఁగు లెన్నెని యావిధిఁ బొసఁగుచుండుఁ ।
గాన బాల్య వివాహముల్ మానరయ్య!

స్త్రీవిద్య నొసఁగంట శిక్షించుచుంట కీ। కందుల పెండ్లిండ్లె కారణములు

ప్రజనెల్ల మసఁగల దుర్వ్యవహారంబగుట కీ। కందుల పెండ్లిండ్లె కారణములు

మానవుల్ ఘోర పాపాత్మతల పాలగుట కీ। కందుల పెండ్లిండ్లె కారణములు

కట్నముల్ తుల్యముల్ కడుబాధఁ గొనుట కీ। కందుల పెండ్లిండ్లె కారణములు

గీ॥ వేయి మాటలేల? విధవల సంఖ్యయుఁ
బ్రబలి దేశమునకుఁ బ్రబలమైన
కష్టిఁ దెచ్చి యిడఁగఁ గందుల పెండ్లిండ్లె
కారణములు ప్రబలకారణములు॥ 23

సీ॥ సంసారమనెడు వృక్షమున కీ పెండ్లిండ్లు। వేరు పుర్వు నా? యంట వింత కాదు

వేరముల్ పొసగించు విద్య కీ పెండ్లిండ్లు। నారదాంశములంట నవ్వు కాదు

కనుచుండఁ గుతుకంబుఁ గొనుట కీ పెండ్లిండ్లు। గజదొంగలంట యక్కజము కాదు

విడువని దుఃఖంబు విడుట కీ పెండ్లిండ్లు। కడగండ్ల గనులంట కల్ల కాదు॥

గీ॥ భవనము వనమ్ముగాఁగఁ గన్పడఁగఁ జేసి
యతుల గతుల దంపతులను ననయమలయఁ
జేయు ప్రజ్ఞ కీ పెండ్లిండ్లు చేటుఁ జేయు
గ్రహములనియంట సంశయావహము కాదు॥

సీ॥ చిలుకపురాణింపు రాచిలుక కూఁతలఁ బెంచి | పెంచి పిల్లికి సమర్పించినట్లు
చెఱకు చేనెప్రుగా చెఱకు బెంతకుఁగాచి | కాకి కన్నుల పాలఁ
గోరిచినట్లు
చేతులారఁగ నెళ్ళు చేది పోషణఁజేసి | చేసి పూదీఁగలఁ జదిమినట్లు
జింక పిల్లలఁగూర్చి చిలుకఁజేరఁగఁదీసి | తీస్కి జొమ్ముగ్గి నోటవేసినట్లు

గీ॥ పది నెలలుమోసి మముఁగాంచి బాళివీఱఁ
బెంచి మామూలమున నేసరించి ధనముఁ
దుడకఁ బేరిమను బంధంబుఁ దుంచి ముసలి 25
దయ్యాముల కప్పగింతురే! తల్లులార!॥

సీ॥ మిసమిస లాడెడు మిసిమి బంగరుచేల | వెఱ్ఱిబొమ్మకును గట్టిపెట్టినట్లు
తోరంబుగలవొడ్డ దొండపండుచుమాల | కాకిముక్కునువేలఁగట్టినట్లు
నిగనిగమను నిండ్రనీల మాణిక్యంబుఁ | గోనిపాపరకును గూర్చినట్లు
తలతలమనెడు రత్నంపు దీపము శూన్య | నిలయమధ్యమునందు నిల్పినట్లు॥

గీ॥ దయయు దాక్షిణ్యమును బాప భయముమాలి
శుల్కమున కాసపడి కడుఁ జుల్కవృత్తి
లేతవయసునవున్న బాలికలఁబట్టి
ముసలి దయ్యాల పాల్సేయు టనదు కాదె?॥ 26

సీ॥ ఘుమఘుమమను మాను స్వచ్ఛ గోఘృతంబును జెను | బూడిదలోఁ బారఁ
బోసినట్లు
మేలైనయాణి ముత్యాలపేరును గోఁతి | దిమ్మరిచేతి కందించినట్లు
రమణీయతరపద్మ రాగమాణిక్యముల్ | పుచ్చపండ్లకు వెలఁబోసినట్లు
పెద్దకాలము మేకపిల్లలఁబోషించి | పెద్దమ్మవారికర్పించినట్లు॥

గీ॥ దయయు దాక్షిణ్యమును బాప భయముమాలి
శుల్కమున కాసపడి కడుఁజుల్కవృత్తి
లేతవయసుననున్న బాలికలఁబట్టి
ముసలివయ్యాల పాల్సేయు టెందుకాదె? 27

[illegible] మంచి [illegible] తములను | [illegible] కొట్టినట్టు
బౌపలకుఁగల ముత్తియములకై యాశించి | మదకరీంద్రముఁబట్టి చంపినట్టు
కైకంపనిఫలంబుఁ గైకొంటకై చెట్టు | గొడ్డంటఁ బ్రేళ్ళతోఁ గూల్చినట్టు
ఎలుకలబాధ మాయింపఁగా నూహించి | యింటికి నగ్గి నంటించినట్టు॥

గీ॥ మూరభారంబుఁ జూడక దోసమనక
శుల్కమునకాసపడి కడుఁజుల్కవృత్తి
లేతవయసుననున్న బాలికలఁబట్టి
ముసలివయ్యాల పాల్సేయు టెందుకాదె? 28

సీ॥ అతి బాల్యమున వివాహంబు సేయుటకంటెఁ । గుత్తుకఁ గత్తిచేఁ గోయ రాదె?
కడువృద్ధునకు బల్మిఁ గట్టిపెట్టుటకంటెఁ। బుట్టఁగానె విషంబుఁ బెట్టరాదె
శుద్ధమూర్ఖునితోడ జోడుఁ గూర్చుటకంటెఁ । దెంపున గంగలోఁ దింపరాదె?
శుల్కంబుఁగొని మఱుఁ జుల్క చేయుటకంటెఁ । పెద్దమ్మవారి కర్పింప రాదె!

గీ॥ ప్రాణసమముగఁ బెంచు మేలైనవారలు
కఱకుఁగలిగిన మంగలి కత్తిపాలు
చేయుకంటెను బ్రాణము తీయరాదె?
మనుజనములార! యోతల్లిదండ్రులార!॥ 29

సీ॥ వరపక్షణాలమీఁది వాంఛచే నొక్కండు । పిల్ల చక్కనిదంచుఁ బ్రేమ నొకఁడు
గొప్పసంబంధమన్ కోర్కెచే నొక్కండు । మేనరికంబన్న మేరనొకఁడు
ప్రాఁతచుట్టరికమన్ ప్రీతిచే నొక్కండు । పెండ్లికాదఁటనంచు భీతి నొకఁడు
తల్లిదండ్రుల యాజ్ఞ దాఁటలేకొక్కండు । స్వల్పశుల్కంబన్న భ్రాంతి నొకఁడు॥

గీ॥ ఇల్లటపుటల్లుఁడైయుండ నెంచి యొకఁడు
నత్తవారింట యాస్తిపై నాసనొకఁడు
ముందు ముప్పెఱుంగక చిన్ని ముద్దియలను
బెండ్లియాడు మఘనాత్ములు పెద్దవారు॥ 30

సీ॥ ప్రథమ సంతతింబు పడసిన సంతతిఁ । బోషింప నెవ్వరుఁ బూనరనుచు
తనకున్న దారిద్ర్యమంతయును ననుభవించు । వారలెవ్వరును లేరటంచు
పుత్రులు లేకున్నఁ బున్నామనరకంబు । మానవులకు నెల్ల మానదనుచు
అర్ధాంగి లేకున్న నవసాన దశయందుఁ । దనకు దిక్కెవరుఁ దగులరనుచు

గీ॥ పురుషుఁడుండ పత్నికిఁ గాదె పరఁగ నేని
కర్మకాండకు భంగంబు కలుగుననుచుఁ
సమకుఁగా మెచ్చ లేకున్నఁ దగవు మాని
పెండ్లిఁ గోరుచు నున్నారు పెద్దవారు॥ 31

సీ॥ తమిమీఱ మంగళస్నానంబు సేయుచో । బలిచేత గన్నుల వణఁకి వడఁకి
ప్రియ మెప్ప హోమముల్ వ్రేల్చుచోఁ గనరాక । యాజ్యంబు బూడిద
యంచు వేల్చి
కొత్త వస్త్రము గట్టుకొన నిల్వఁగాలేక । యచ్చటివారి సాయంబు వేఁడి
అగ్ని ప్రదక్షిణం బాచరించుచు నొడల్ । దిరిగి పీతాక్షుఁడై ధరణి వ్రాలి

గీ॥ పీటపై నుండఁగను లేక పాటవంబు
చిట్టి బొట్టెలఁ బెండ్లియై చెట్టఁబట్టు
పెద్దవారికి వేలాము వెట్టిగాక
యేమి సౌఖ్యంబు? పెండ్లాని కేమి సుఖముఁ 32

సీ॥ బెబ్బులి కడ లేడి పిల్ల పొందుసుఖంబు । శరభంబు దరిహరి పొరయు సుఖము॥
చీలి దగ్గరఁజిన్ని చిలుక కాంచుసుఖంబు । ఫణిచెంగటను గప్పపడెడు సుఖము॥
ఎలుఁగు సన్నిధిఁజీమ యెనయునట్టి సుఖంబు। నసురయొద్దను నరుండందు సుఖము॥
యమునిముందర దుష్టుఁడనుభవించు సుఖంబు । బకముచెంతను జేప పడయు సుఖము॥

ఆ॥ హరిసమీపమందు గరిపొందు సుఖమును
బర్హి యెదుటఁబాము పడుసుఖంబు
ననుభవించుచుండు ననవరతంబును
బాలభార్య వృద్ధ భర్తయింట॥ 33

సీ॥ పేదవాఁడనటంచుఁ బెద్ద కూఁతును జైత్య। రోగికిచ్చెను వేయి రూప్యములకు
ఋణముఁదీస్త నటంచు రెండవ సుతనిచ్చెఁ । బేడివానికి వేయి మాడలకును
యజ్ఞంబుఁ జేసెదనంచు మూఁడవబిడ్డ । వెయివరాలకు నొక్క వెఱ్ఱికిచ్చె
కఠినాత్ముఁడై నూఱుకాసులకును మూఁడు। గాళ్ళముసలికిచ్చెఁగడకునన్ను॥

గీ॥ రత్నములవంటి బిడ్డల ఱాళ్ళపాలు
చేసియును దాను జేసిన దోసమునవో?
బాగుపడలేదు మాతండ్రి; బాగుపడునె!
కన్న బిడ్డలనమ్ము రాక్షస ఖలుండు॥ 34

సీ॥ బొమ్మల పెండ్లిడ్ల పోల్కె బాలల పెండ్లి। యింపుఁగొల్పునటంచు నెంచి యెంచిఁ
మనుమరాలి వివాహమునుజూచి హర్షింతురి। తాత యవ్వయటంచుఁ దలఁచి తలఁచి
సుతపుష్పవతి యైనచో బ్రాహ్మణత్వమే। పోవునంచెద భీతిఁ బొంది పొంది
శుల్కంబుఁగొని యొక్కచో వడ్డికిడినడ। బ్బిబ్బడి యగునంచు నబ్బి యబ్బి॥

గీ॥ వరుఁడు లేనట్టి యొకముదివరడునకును
నేండ్లనిమిది నిండకమున్నె పెండ్లిచేసి
కొలఁదినాళ్ళకె నన్నొక కుంకఁజేసి
దనుజసములైరి నాతల్లి దండ్రులకట!॥ 35

సీ॥ పాలునీళ్లును బోలెఁ బాయకలగుసతి। పతులనొండొరులను బాపినావొ?
తావియుంబూవుచందమున నైక్యముగల్గు। దంపతులకుఁబగల్ దాపినావొ?
చిలుకయుంగోరువంకవలె మైత్రిగలవధూ। వరులకారాటంబు నెరపినావొ?
వలపునమించుగువ్వల లీలవిహరించు। జంపతులను వేఱుసలిపినావొ?

గీ॥ తత్ప్రతిఫలంబు సుమ్మిది తప్పదనుచు
ప్రాఁతఫలమంచునోదార్పఁ జూతురిపుడు
తాముచేసిన కార్యంబుదలఁపఁ బోక
తగవుమాలిన నాతల్లిదండ్రులకట!.

సీ॥ కల్కిపల్కుల రామచిల్క జంటను బాపి। పంజరంబుల బాధపఱచి
నావో?
కవగూడి పొల్చు జక్కవయుగ్మ మెడఁబాపి। పటుతరంబగు బాధపఱచి
నావో?
ప్రియముమై విహరించు పికయుగంబును బాపి। పాపంబనక బాధపఱచి
నావో?
మధువానిక్రీడించు మధుపద్వయముఁ బాపి। పసటునంగిడు బాధపఱచి
నావో?

గీ॥ రమణిఁ గవగూడు గోఱువంక దంపతులను
బాపి పయమాలి బలుబాధ పఱచినావో?
లక్షలంబిడి కుసుమకోలి ప్పదనుచుఁ
తల్లిదండ్రులె యిప్పుడో దార్చ రకట! 37

సీ॥ భర్తనుఁగోల్పోయి పలవించు కామినిఁ। జెలఁగి నవ్వుచు గేలిచేసినావో?
నాథునిఁ బాసి చింతల నొందు కాంతను। గాంచి మేలంబుఁ గావించి
నావో?
పతివిడనాడిన పద్మాక్షి నీక్షించి। కూడనియొకసక్కెమాడినావో?
ప్రాణనాథుని పొందుఁబడయ నేరకయుండు। సద్భాగ్య హేళనమాడి
నావో?

గీ॥ ఇంక నెవ్వరిఁ జూచి గర్వించినావో?
ప్రాగ్భవంబునఁ దద్ఘోరపాపమిట్లు
ప్రాణనాయకు పొందెడఁ బాపెననుచుఁ
దల్లిదండ్రులె యిప్పుడో దార్చ రకట! 38

సీ॥ ధనముకై యాశించి యనురాగలతఁ ద్రుంచి। తనయనమ్మినతల్లిదండ్రులార!
ఇనుమైపురలను లంచమిరవుగా। గొనవఘాతములఁగూర్చిన రాయబారులార!
పప్పుభోజనములపైఁ బ్రీతిఁగైకొని। ప్రియములాడిన పెండ్లి పెద్దలార!
బహుమతులైయుండి బహుమతుల్గోరిమ్ము। పొత్తుల్వచించిన జ్యోశ్యులార!

గీ॥ అసురసములార! నిర్దయస్వాంతులార!
శఠహృదయులార! నాపాలిశత్రులార!
కారణంబీబెడంపకు మీరె కారె?
చలముతీరెనె? మీకనుల్ చల్లవడెనె? 39

సీ॥ సోముఁగేరెడు లేఁత మోమునఁ గస్తూరి। రేఖపోయి విభూతి రేఖవచ్చె
తళతళలీను నిద్దంపుగాజులుపోయి। కేలమోడైన పట్టీలవచ్చె
మృదువైన వన్నెచీరెలుపోయి నెమ్మేన। ముతుకనూల్ సైనదోవతులు వచ్చె
గళమున భూషణావళిపోయి తులసిమా। లికలు రుద్రాక్షమాలికలవచ్చె

గీ॥ కలికికాన్రిలుఁగమ్ము గవనునీలంపుఁగ
జ్జలముపోయియశ్రుజలమువచ్చె
బాధలెన్నఁదరమె! బాల్యవైధవ్యంబు
దుస్సహంబు మిగులదుస్సహంబు 40

సీ॥ మృష్టాన్నముఁ గడుపార భుజియించు టది మాని | యేకభుక్తముగఁ గృశింప
వలసె
అనుపమభోగంబు లనుభవించుటమాని | భోగులఁ బోడఁ గాంచిపోగల
వలసె
శుభ శోభనంబులు చూడఁ బోవుటమాని | తీర్థయాత్రలకంచుఁ దిరుగ
వలసె
మృదు పుష్పశయ్యలమేను జేర్చుటమాని | బండ నేలలయందె పండ
వలసె

గీ॥ చందనాది సుగంధ చర్చలను మాని
కాయమున బూదిపూఁతలు పూయవలసె
నిట్టికష్టంబు లెట్లు సహింతు నకట!
బాల్య వైధవ్య మతి దుఃఖభాజనంబు 41

సీ॥ పతికుపచారముల్ పసరించు హస్తముల్ | పెఱసేవనముల కర్పింపవలసె
ఘనసారగంధ మాఘ్రాణించునాసిక | కూరవాసనల మూర్కొనగ వలసె
శయనగేహమున వాసముఁజేయు నెమ్మేను | ఇంటయింటనె కూలఁ బడఁగ
వలసె
దిన మొక్క క్షణముగాఁ జనునట్టి కాలంబు క్షణ మొక్క దినముగాఁ
గడపవలసె

గీ॥ ఇస్సిరో! దుర్నిరీక్ష్యంబు దుస్సహంబు
దుస్తరంబు దురంతంబు దుర్దమంబు
దుర్భరంబు దుర్వ్యూహంబు దుఃఖదంబు
బాల్య వైధవ్య మనుభవింపఁగ వశంబె? 42

సీ॥ రంగుచీరల నమురాగంబు పోలేదు | మల్లుచీరలరక్తి మాయలేదు
పూలచీరలయందు బాళి తీఱఁగలేదు | సన్నచీరల సక్తి సమయలేదు
జలతారుచీరెల వలపు చెల్లఁగలేదు | మళ్లచీరెలఁ గోర్కె మళ్లలేదు
పట్టుచీరెలయందు భ్రమ మాయగాలేదు| తోపుచీరెలఁ బ్రేమ తొలఁగలేదు

గీ॥ రకరకంబులైన రైకలమీఁదను
మనసుదీరలేదు తనదుసాటి
చెలులు ముద్దుసుసుల చీరెలఁ గట్టఁగ
నైనుగట్టి నేను నైపఁగలనె ? 43

సీ॥ బండ నేలను నేను బడియుండఁ బరుపుపైఁ | బండ మీ మనసులే భంగి నొప్పె
చన్నీళ్ల నేను మజ్జనమాడ వేన్నీళ్ల | స్నాన మెట్లోర్చె ? మీమానసంబు
నిశలెల్ల పగలచే నేఁ గృశింపఁగను నే | కరణివచ్చెను? మీకుగాఢనిద్ర
కొయ్యరొట్టెలు మెక్కి గోడు నేఁజెందంగ | మృష్టాన్న మెట్లు మీ కిష్ట మయ్యె ?

గీ॥ చిన్నవయసుననుండి మీ జీవములకు
నుస్సురనియేడ్చు ననుఁజూచుచుండి యకట !
వృద్ధులై యెట్లు సుఖియింప నిచ్చగలిగె ?
వనుజనుములార ! యో తల్లిదండ్రులార ! 44.

సీ॥ మల్లెపువ్వులఁ జామంతి పువ్వులజాజి । విరులను గనుఁగొన్న తరుణ
మందుఁ
బచ్చకర్పూరంబుఁ బండువెన్నెలమంచి । గంధంబుగాంచిన క్షణమునందు
శృంగార వనముల బంగారునగలను । మేలిచీరలఁగన్న వేళయందు
సొగసగు శయ్యల వగగుల్కు చిత్రముల్ । డోలికల్ వీక్షించు కాలమందు
గీ॥ మించుటద్దంబులను దిలకించునపుడు
బండుటాకులు కన్పట్టు పట్టునందుఁ
బ్రాణనాథునిఁబాసిన పడతిమనసు
శోకసాగర మగ్నంబు గాకయున్నె ?

సీ॥ పెండ్లివారిండ్లకుఁ బేరంటమున కేగు । మించుబోణులను వీక్షించునపుడు
విభులకుఁ గర్పూర విడియంబు లందించు । చంచలాక్షుల నిరీక్షించునపుడు
గురుల చిక్కుఁడలించి విరులయెత్తులఁదాల్చు । కాంచనాంగులఁ దిలకించు
నపుడు
సరస సల్లాపముల్ వరుసతోఁ గావించు । నంచయానల విలోకించునపుడుఁ
గీ॥ చిత్త మెరియ నసహ్యంబుఁ జెంది కుంది
విరహపరితాపమునఁ బురపురను బొక్కి
సొక్కి తమిఁజిక్కి తాలిమిఁ దక్కి స్రుక్కి
పొందు వ్యాపిత క్లేశముఁ గొందు నకట! 46

సీ॥ సెజ్జపైనుండి లేచినవేళఁ గన్నడు । నో? యంచు నోరల నాదుగుచుండ్రు
పొరుగూరుపైనమై పోవుచో నెదురేగు । దెంచునో ? యని సంశయించు
చుండ్రు
శుభకార్యములఁ దాము చూడఁ బోయెదు పట్ల । వెంటనే గఁగఁ జూచి
విసుగుకొండ్రు
కూడుఁ గుడ్డయుమాలి కొంపఁ జేరెనటంచుఁ । గోపించి పలుమాఱు గొణు
గుకొండ్రు

ఆ॥ వచన మెంత శుచియు రుచిఁ గల్గఁజేసిన
నేవొ వంకలెంచి యీసడింతు్రు
దయనుమాలి తల్లి దండ్రులే పుట్టింట
బాల విధవ బ్రతుకుబ్రతుకె బ్రతుకె ? 47

సీ॥ పతిపాదపద్మముల్ భక్తితోఁ బూజించి । పుడమిపైగరిమంబుఁ బొందు
టెట్లు?
ముద్దుముచ్చటదీఱ ముత్తైదువులఁగూడి । పేరంటమునకింక వెళ్లుటెట్లు
బిడ్డలఁగనిపెంచి ప్రేమతోముద్దాడి । లోచనోత్సవముగాఁ జూచుటెట్లు?
నానెచ్చెలియితండు నామనోహరుఁడంచుఁ । జెలులకుఁ జూపించిచెప్పు
టెట్లు?

గీ॥ చుట్టములయిండ్లలో శుభశోభనములు
కలుగువేళలసరివారిఁ గలసిమెలసి
పోవుటింకెట్లు? నేవట్టిపుణ్యహీన
రాలనైతినె? యకట! యిఁకేలబ్రతుకు 48

సీ॥ కన్నబిడ్డలఁగూర్చి కరుణనక్కునఁజేర్చి । చెక్కులు ముద్దాడి సొక్కు సొగసు
నుయ్యాలలందుంచి యొయ్యారముగనూచి । జోలపాటలుపాడి సోలు సొబగు
సంజచాయనుజూపి చందమామనుజూపి । లాలించిపోమార్చు మేలి హొయలు
గోర్వంకయనిపించి కూనలఁగనిపించి । ప్రియమునై బువ్వఁ దిన్పించు హావుసు

గీ॥ లలితభూషలువలువ లలంకరించి
యిరుగుపొరుగుల పిల్లల నెనసిమెనసి
యాటలాడంగఁ బొడఁగాంచి యలరుపొంపుఁ
గనయరో చరితనపు వాపములమనువు 49

సీ॥ ఎలనవ్వు నవ్వుచు నెలమిమైఁ గేలెత్తు । కొమ్మని యెత్తుచోఁ గ్రొత్తనలువు
లీలతోఁ దనయంత లేచిసారెకు నేల । విద్దెముల్ సేయుచో ముద్దుచెలువు
లలిమీఱ నల్లనల్లనఁ దప్పటడుగులు । వేయునప్పుడుతోఁచు వింతమురువు
తొక్కుపల్కులఁ దేనెతొలుకంగఁ బలుకుచోఁ । గనుపట్టునట్టి యక్కజపుహారువు

గీ॥ కన్నబిడ్డలకడఁ దనగన్నుదోయి
కఱవుదీఱఁగ మగనితోఁ గాంచలేని
పాపినగునన్నువంటి నిర్భాగ్యబాల
విధవజన్మంబు [illegible] వ్యథయెగాదె ? 50

సీ॥ తల్లియేనాయఁగాఁ దలపోయుచుండంగఁ । దండ్రియే నిర్దయత్వంబు దాల్ప
నన్న లేపలుమాటలాగ్రహించుచునుండఁ । దమ్ములేయలఁతిఁగాఁ దలఁచుచుండ
వదినెలేచలపట్టి బాధించుచుండఁగా । మఱఁదండ్రి మర్యాదమానియుండ
శాలియంద్రుమన్నన సేయకేమఱియుండ । నక్కలేపరుషంబు లాడుచుండ

గీ॥ నన్నిఁటికి సైచి పగలు రేలనక యోర్మిఁ
గూర్మికనుపట్టఁ బట్టింటఁ గూఁటికొఱకు
గుడ్డకొఱకును బానిస కూఁతులట్లు
బాలవిధవలు పడుపాట్లు బ్రహ్మకెఱుక 51

సీ॥ చిత్తేశ్వరుని రూపుఁ జిత్రింబునను వ్రాసి । మెప్పించి పొందెడు మేటి సుఖము
ప్రాణేశ్వరుని మీఁదఁ బదపద్యములఁ గూర్చి । యలరించి పొందెడు నమిత సుఖము
కాంతునికడ నమర్గర్భసూక్తులు పల్కి । కరఁగించి పొందెడు పరమ సుఖము
చెలువుని చెంతనం చితవిలాసము చూపి । వలపించి పొందెడు వరసుఖమ్ము

ఆ॥ విభుని సరసమిగుల విన్నాణములనొప్ప
కట్టుపనులఁ బూస గ్రుచ్చుపనుల
నైపుణములనెల్లఁ జూపి చొక్కించుచు
పొందుసుఖమదెంత పుణ్యవతికొ? 52

సీ॥ ఆఁడుజన్మంబెత్తి గోడుఁ జెందుటకంటె । నగమొ? పాషాణమో? యగుట మేలు
పుడమివేల్పులయింటఁ బుట్టువొందుటకంటె । నడవిలోఁ బెద్ద మ్రానగుట మేలు
వృద్ధపిశాచంబు కిల్లాలగుటకంటెఁ । బరివిమల బ్రహ్మచర్యంబు మేలు
బాలవితంతువై వగచుచుండుటకంటె । యోగినినై కాననుంట మేలు

గీ॥ పొట్టకును బట్టకును జేరి పుట్టినింట
బానిసలరీతి రేలును బగలు ననక
పనులు సేయుచుఁ బలుపాట్లు పడుటకంటెఁ
తటుకున విషంబుఁ ద్రావి చచ్చుటయె మేలు 53

సీ॥ అత్యంతదారిద్ర్య మనుభవింపఁగవచ్చు । బాలవితంతువై బ్రతుకరాదు
బలురోగములచేత బాధనొందఁగవచ్చు । బాలవితంతువై బ్రతుకరాదు
ధనకాములయింట జనియింపఁగావచ్చు । బాలవితంతువై బ్రతుకరాదు
సేవాపరివృత్తిచే జీవింపఁగావచ్చు । బాలవితంతువై బ్రతుకరాదు

ఆ॥ వితతపాపియగుచు బ్రతుకంగవచ్చును
బాలవిధవయగుచు బ్రతుకరాదు
మతివిహీనయగుచు బ్రతుకంగవచ్చును
బాలవిధవయగుచు బ్రతుకరాదు

కాలియందియలును గడియారాలుఁదీయంగఁ । దలచుఁచో నెమ్మేనుజలదరిల్లి
నిగనిగ్గుమను బల్ నిడుపు పెన్నెఱిగంపు । ఖండింపనెంచుచోఁ గంప మొంది
కాంతులనీను చొక్కంపుఁ జేగాజులు । పొడిసేయఁబూనుచో నొడలు మఱచి
గళమునవ్రేలు చక్కనిపుస్తెఁబుటుకునఁ । ద్రెంపంగడంగుచోఁ స్పృహను దప్పి

గీ॥ పన్నపుట్టంబు వెడలించి సైనుబట్టఁ
గట్టఁజేయుచోఁ బ్రాణంబుకడనుబట్టి
కాంతలుండంగ దయమాలి కన్నవారె
వికృతరూపులఁగాఁగఁ గావింతు రకట ! 55

సీ॥ పన్నకుంకుమరేక సున్నమైన మొగంబు । పవలింటచంద్రబింబంబుగాదె
ఒపపరిదగలెల్ల ఱూడ్చిననెమ్మేను । పూవులంగోసిన తీవగాదె ?
నూనెరాయకయున్కి నునుపుదక్కిననెఱుల్ । చమరీమృగంబువాలంబు గాదె?
జాలువారెడు నశ్రుజలముఁ గల్గినకనుల్ । మంచునఁదోఁగు తామరలు గాదె?

గీ॥ గద్గదికదోఁపఁగాఁ [illegible] పల్కు
వికృతివాసంత [illegible] పికముగాదె?
[illegible] భూభోగములమఱియు
[illegible] పిశాచంబు గాదె? 56

సీ॥ నిత్యశృంగారంబు నిష్ఫలంబైపోయె । నవయోవసంతమును బవటఁగలసె
కాటుకగోరి యల్కానల పాలాయె । కస్యతులసి కొఱగాకపోయె
మోచేతి పద్మంబు మొదల వ్యర్థంబాయె । చల్లచుక్కయు మేలు సలుప
దాయె
వరలక్ష్మియైన నాపదఁ బాపరాదాయె । చిట్టిబొట్టువ్రతంబు చెట్టఁబట్టె॥

గీ॥ తద్దినోములైనఁ దప్పింపలేవాయె
భారమైన యీ విపత్తునుండి
నోములెందునైన బాములఁ బాపునె?
వనజముఖుల వెఱ్ఱితనముగాక!॥ 57

సీ॥ దయలేనివారలఁ దలిదండ్రులుగఁ జేయ। దైవమా! నాయందుఁ దప్పుగలదె?
కడుబీదబాపల కడుపునఁ బుట్టింప । దైవమా! నాయందుఁ దప్పుగలదె?
ముసలియన్ మొసలికి ముదితనుగాఁ జేయ । దైవమా! నాయందుఁ దప్పు
గలదె?
పసితనంబుననె నాపతినిఁ జంపుకపోవ। దైవమా? నాయందుఁ దప్పుగలదె?॥

గీ॥ జోడుపీడక నాయీడు జోడుచెలులు
వేఁడుకల వెల్లిలో నోలలాడుచుండ
జోడుగూర్పక నన్ను విజ్జోడుచేయ
దైవమా! దీననాయందుఁ దప్పుగలదె?॥ 58

సీ॥ కొమ్మలతోఁగూడి బొమ్మల పెండ్లిండ్లు । చిత్తంబు రంజిల్లఁ జేయలేదు
వండి గుజ్జనగూళ్లు వినుస బంతులుతీర్చి । మిందుబోణులకు వడ్డించలేదు
నెయ్యంపువాండ్రతో నెయ్యంబు రెట్టింపఁ । దూఁగుటుయ్యాలలఁ దూఁగలేదు
పసుపుఁ గుంకుమయును బదిమంది చెలులకు । వేడుకతోఁ బంచిపెట్టలేదు॥

గీ॥ ఒక్కలాఁకుఁ జేఁబూని యొక్కనాఁడుఁ
జక్కఁగా వేడియంబును సలుపలేదు
కటకటా! దయ్యమా! యింత కరుణలేక
కులుకమంతయు నిప్పుడే కూల్పఁ దగునె?॥ 59

సీ॥ అచ్చనగాయ లప్పచ్చులు నల్లానే । రేకులుఁ జెలులతో నాడలేదు
ఆలంకి గుడియంజి యోలకూఁతల నీడు । జోడుచేడెలతోడ నాడలేదు
కనుమూసి గంతలన్ గంబాలయాటలు । వేడుకతోఁ గూడి యాడలేదు
ఒప్పులకుప్పలు నోమనగుంటలుఁ । దోడిబాలికలతో నాడలేదు॥

గీ॥ గోడిపట్టెలు గొబ్బిళ్ళు నాడలేదు
తక్కఁగల్గిన క్రీడలఁ దనివిదీఱ
నాడలేదప్డె నా మేలు చూడలేక
మాలదయ్యమ! నన్నిట్లు మూలఁ ద్రోసితె॥ 60

సీ॥ పండుగనాఁడైన నిండువేడుకతోడఁ । బట్టుపుట్టంబులఁ గట్టలేదు
మువ్వంబుగాఁ గురుల్ దువ్వి బల్ సోయలుగా । జడవైచి పువ్వులు ముడువలేదు
ఇరుగుపొరుగువారి నెరవుతెచ్చుకయైనఁ । బసిడినగల్ మైనిండఁ దాల్పలేదు
తోయంపువారలతోఁ గూడి పేరంటం । బునకైనఁ బసుపుమాలు చనఁగ లేదు॥

గీ॥ కోర్కెలేవియుఁ దీఱనికూన నాకు
హెచ్చు వైధవ్యదుఃఖంబుఁ దెచ్చిపెట్టి
వెతలఁగుడుచుచు నీకీతి బ్రతుకుమనుట
ధర్మరక్షక! నీకిది ధర్మమయ్యా!॥ 61

సీ॥ అత్తవారింటనే యణఁగియుండుమనన్న । నాగోడుఁజూడరనాథనగుట
కన్నవారలయింట కడకేగుమటన్న । లెస్సగా వారికే లేదుతిండి
బంధువులిండ్లలోఁ బడియుండుమనియన్న । నాయన్నవారు కానంగరారు
నగలు మార్చుక జీవనంబు సేయుమన్న । శుల్కవిక్రీతకే సౌఖ్యమింక?

గీ॥ ఇంక నెందులకేగుదు? నెవరుదిక్కు?
జీవయాత్రకు నాకెద్ది త్రోవ? యకట!
బ్రతుకఁజాలను నన్నుఁగూడ భర్తకడకు
దయను గొనిపోవఁగదవయ్య! ధర్మమూర్తి॥ 62

సీ॥ అమ్మరో! యీపుణ్యమయ్యె! మాయమ్మ, యనుచుఁ । బెఱవారిఁజాల సేవింపఁజాల
చేఁజాచి సంగడిఁజూచియునుఁ దేహియనుటంచుఁ । దీనతఁజాలఁ బ్రార్థింపఁజాల
“అనఘ! నాథ! నన్ను నాదరింపరె”! యంచుఁ । గృపపుట్టఁజాలఁ గొయ్యిడఁగఁజాల
“గతిలేదటంచు నీకన్న మాకెగతి!” యంచు । వెతలెల్లఁజాల విన్పింపఁజాల॥

గీ॥ పసుల కొంపలలోఁజేరి పనులుసేసి
బానిసవలె హేయముగఁ బొట్ట పోసికొనుచు
బ్రతుకఁజాలను గతిలేని పాపినన్ను
దెంపునను జంపుకొనిపోవె! దేవదేవ!॥ 63

సీ॥ ఫలమును రుచియును గలసియుండెడురీతి । విభుఁడు నేనును గూడ వేడుకయును
సుమము మరందంబు నమరియుండెడుభాతి । వరుఁడు నేనునుగూడ వైభవమును
వాక్కును నర్థంబు వఱలుచుండెడుభంగిఁ । బతియు నేనును గూడ బందువయును
శశియు శీతలతయు జానుమీఱెడుమాడ్కి । సఖుఁడు నేనునుగూడ సంతసమును॥

గీ॥ మాల దైవమ! యీజన్మ మధ్యమందు
నాకు లేకుండఁజేసి యన్యాయముగను
బాధఁబెట్టెదవేమి లాభంబునీకు?
నబలననియైన జాలిలేదాయె నకట!॥ 64

సీ॥ రమణుండు దేశాంతరమునుండి యంపిన । క్షేమలేఖను జూచి చెందుముదము
మగఁడు విదేశసీమల కేగుదెంచి వ । చ్చిన వేళవీక్షించి చెందుముదము
ధవుఁడన్యపుర నికేతనుఁడైనఁ దనకైన । సేమంబు వ్రాయుచోఁ జెందు ముదము
నాథుండు పరపట్టణమునుండి సొమ్ములు చీరలు నంపుచోఁ జెందుముదము॥

గీ॥ పొందఁజాలని నావంటి మందభాగ్య
రాలిజీవన మెన్ని చందాలనైన
వృథయె! కావున నన్ను నావిభునికడకుఁ
దెగువఁగొనిపోవఁగదవయ్య! దేవదేవ॥ 65

సీ॥ కర్పూరంపు విడెంబుఁ గాంతునకిచ్చుచో । హస్తసంస్పర్శచే నమరు సుఖము
నెలమి మనోహరుం డేకాంతమాడుచో । నాస్యసంస్పర్శచే నమరుసుఖముఁ
బవళించుతఱిఁ బదాబ్జాతమ్ము లొత్తుచో । నంఘ్రిసంస్పర్శచే నమరుసుఖముఁ
జంకఁబిడ్డను బ్రాణసఖునకందించుచో । నంగసంస్పర్శచే నమరుసుఖము॥

గీ॥ నొందఁజాలని నావంటి మందభాగ్య
రాలిజీవన మెన్ని చందాలనైన
వృథయె కావున నన్ను నావిభునికడకు
దయను గొనిపోవఁగదవయ్య! ధర్మమూర్తి॥ 66

సీ॥ శాస్త్రీయమునఁ జెప్పు కష్టంబు గోలెంప | బ్రతుకునే నిర్భాగ్యరాలు?
అంగుళీకంబు నాసాగ్రంబునను జేర్చి | బ్రతుకునే ఘోరపాపాత్మురాలు?
ఈక్షణంబును భర్తకై లక్ష్యముఁ జేసి | బ్రతుకునే పరమ దుర్భాగ్యురాలు?
వినుతన్యాయైలోక విభవంబులనురోసి | బ్రతుకునే దురదృష్టవంతురాలు?

గీ॥ అట్టి బాలవితంతువు నవనియందు
లేకయుండంగఁ జేసిన లోకమునకు
లోటురాఁబోదు సత్కృపలోఁదలంచి
ధవునితోఁ గూర్పవే! నన్ను ధర్మమూర్తి ! 67

సీ॥ కంటకశేలకొక్కటై ధారగా నశ్రు | జలములోడ్చెడు పాపజాతి యెవతె?
శోకాగ్నిమీఁద మోమును జేర్చి సంతప్త | చిత్తయయ్యెడు పాపజాతి యెవతె?
పారెడునేఁడి నిట్టూర్పుల నిగుడించి | ఘూతలెంచెడు పాప జాతి యెవతె?
నేలవ్రాయుచుఁ గాలివ్రేలితో బ్రతుకుపై | రోఁతనొందెడు పాపజాతి యెవతె?

గీ॥ అట్టి బాలవితంతువు నవనియందు
లేక యుండంగఁ జేసిన లోకమునకు
లోటురాఁబోదు సత్కృపలోఁదలంచి
ధవునితోఁ గూర్పవే! నన్ను ధర్మమూర్తి ! 68

సీ॥ ఆలినిఁ గోల్పోయి యాప్తుని కన్యలమార్చి । మరలఁ బెండ్లాడెడు పురుషు
లార!
నగలకై కూఁతుం ద్రోఁ బెగనమ్మి పిగ్గడి । పెంచుచుఁ దినుగాడు కొమ్మలార!
అల్లుండ్రియింట్లెల్ల నిల్లుగావించి । యప్పుఁ దీర్చుకొను మహాత్ములార!
నరమాంస మమ్మి ధనముఁగూర్చి గర్వించి । చరియించు లుబ్ధకజనములార!

గీ॥ వృద్ధధనికులకు సుతల నిచ్చివార
మృతికిఁగాచుక యుండెడు చతురులార!
ఆత్మకార్య ధురంధరులార! మీకు
మంచి కాదిది! యిఁకనైన మానరయ్య! 71

సీ॥ అకటా! "పరోపకారార్థంశరీర"మన్ । మాటఁ దలంచుఁ డోమాత
లార!
వాత్సల్యమున "నాత్మవత్సర్వ భూతాని" । యనుపల్కు నెంచుఁడో
యవ్వలార!
సదయాత్మలై "యహింసాపరమోధర్మ" । యనుసూక్తి భావించుఁ డంబ
లార!
నిరతంబుఁ "బాపాయ పరపీడన"మ్మంటఁ । దగ విచారించుఁడో
తల్లులార!

గీ॥ బాలికల నిట్లు దుఃఖాబ్ధి పాలుచేయు
పురుషులకుఁ గష్టసుఖములు బోధచేసి
శిశువులకు వివాహంబులు చేయకుండ
నడ్డు పడరమ్మ! మీరైన నమ్మలార! 72

సీ॥ జాత్యభిమానంబు సర్వంబు విడనాడఁ । దగవుగాఁ దోఁచెనే? మగువలార!
కన్నబిడ్డలమీఁది కరుణను విడనాడఁ । జెల్లునే? య[illegible]మీకుఁ జెలువలార!
నయహీనులై భూతదయ విడనాడంగ । ధర్మమార్గంబౌనె? తరుణులార!
స్వప్రయోజన పరత్వమునఁ గన్నెలనిట్లు । హింసింపఁ బాడియే? యింతులార!

గీ॥ కన్నతల్లులె పిల్లలఁ గావకున్న
దిక్కు వేఱెకనున్నదె? తెరవలార!
వ్యాఘ్రములకన్న ఘోర సర్పములకన్నఁ
గ్రూరమతులైతిరే యమ్మ? కొమ్మలార! 73

సీ॥ కన్న బిడ్డలనమ్మి కడుఁ బాతకముఁ గట్టు । కొనఁబోకుఁడయ్య! యో యనఘులార!
పసిపాపలను బట్టి ముసలి వారికిఁ గట్టి । చులకింపఁబోకుఁడో యయ్యలార!
పుత్రికలను గూడఁ బుత్రులఁ గనుజాడ । దయతోడఁ జూడుఁడో తండ్రులార!
నోరులేనట్టి కందుల నేచినయుసురు । తగులకతప్పదో సుగుణులార!

గీ॥ బాలవిధవలు నిత్యంబుఁ బడెడి పాట్లు
నుంత తలపోయుఁడయ్య యో సుజనులార!
మాగతియె మీకుఁ బట్టిన మదికి నెట్టు
లుండునో యెంచుఁ డమ్మ! యో యువతులార! 74

సీ॥ మనదేశ జనసంఖ్యయును వృద్ధిఁ గాంచకున్న | హేతువదేమొ? యూహింప
రయ్య!
పాశ్చాత్యదేశీయప్రజలసంఖ్యాకులై | సుఖియించు కతమేమొ? చూడ
రయ్య!
ఆఁడువారలకీడ నాడించరో సంఘ | బలముతగ్గునొ? లేదొ? తెలియ
రయ్య
విధవలై స్త్రీలెల్ల సధవలుకానిచో | సృష్టిసాగుట దెట్లొ? చెప్ప
రయ్య

గీ॥ పురుషులును స్త్రీలు నైక్యంబుఁ బొరయకున్నఁ
బూజ్యమైన స్వాతంత్ర్య స్వారాజ్యములను
బడయు టెట్టులో? మీరలే నుడువరయ్య?
పుణ్యజనులార? భారతపుత్రులార? 75

సీ॥ సీతతా నెంతటి పూతచరిత్రయో? | ద్రౌపదియెంత విద్వాంసురాలో?
సావిత్రి యెంతటి సద్గుణవతియొకో? | విదులతా నెంతటి వీరమతియొ?
సుమతితా నెంతటిసుమశీలలామయో? | సత్యయెంతటిసాహసాత్మురాలో?
దమయంతి యెంతటి ధైర్యసమేతయో? | చంద్రమతియదెంత సాధ్వియొకొ?

గీ॥ అంతవారల మముఁ జేయరయ్య రాజ!
కీయములతోడఁ గూడ సాంఘికము లెల్ల!
సంస్కరించుట లెన్ని యేసరణినైన!
మాన్యులార! స్వదేశాభిమానులార!

సీ॥ కాంతామణులవేఱుగాగణించుట స్వదే । శాభిమానులకు లక్షణముకాదు
అబలలయాపద లణఁపకుండుట స్వదే । శాభిమానులకు భావ్యంబుకాదు
అర్ధాంగులగుస్త్రీలనసదుచేయుట స్వదే । శాభిమానులకు శ్రేయంబుకాదు
స్త్రీలబానిసలరీతినిఁదలంచుట స్వదే । శాభిమానులకు యోగ్యంబుకాదు

గీ॥ స్త్రీలబానిసటలేకున్న దేశ మెప్పుడు
నున్నతికిరాదు కావున యువతిమణుల
గొడుడిపిమీఁదఁ గాలానుకూలకృతికిఁ
బూనఁగదరయ్యా! దేశాభిమానులార! 77

సీ॥ కూర్మిమైమీబాగుఁ గోరువారముగాని । చలముసాధింప శత్రువులముగాము
పనిపాటలందుఁదోడ్పడెడువారముగాని । యలయింపఁగాఁజెనంటులము
గాము
పురుడింపమీతోడఁ బుట్టువారముగాని । వెలిఁజేయ లాతివారలముగాము
భాగ్యభోగ్యముల మీపాలివారముగాని । తలపోయఁ దేరవారలముగాము

గీ॥ తెగువఁజూపక మామీఁదిపగనువిడిచి
సాదరంబునమముఁ గాంచి సమతనెంచి
కరుణతోనెంచి మమ్ములఁగావరయ్యా!
పురుషవరులార! యోపుణ్యపురుషులార! 78

సీ॥ భ్రూణహత్యలమాన్ప పుణ్యంబులభియించుఁ । గూనలపెండ్లిండ్లు మాన
రయ్యా!
పుత్రిదానముఁజేయ పుణ్యంబులభియించుఁ । గూనలపెండ్లిండ్లు మాన
రయ్యా!
పురుషభిక్షముఁబెట్టు పుణ్యంబులభియించుఁ । గూనలపెండ్లిండ్లు మాన
రయ్యా!
పొలఁతులబ్రతికింప పుణ్యంబులభియించు । గూనలపెండ్లిండ్లు మాన
రయ్యా!

గీ॥ అకట! పిచ్చుకపైఁ జంద్రహాసమట్లు
అబలలము మీకుమాపయి నలుకయేల!
మమ్ముఁగరుణించి చేపట్టి మనుపరయ్య!
పురుషవరులార! యోపుణ్య పురుషులార! 79

సీ॥ శరణాలయంబులఁ గరుణతోఁగట్టించి । నిలువనీడలుమాకు నిలుపరయ్య!
హృద్యవిద్యల నేర్పి వృత్తులఁగల్పించి । జీవనోపాధులఁ జేర్పరయ్య!
పరిణయవాంఛచేఁ బరితపించెడివారిఁ । గోరినవరులతోఁ గూర్పరయ్య!
ప్రియముమైబ్రహ్మచారిణులైనవారల । నెక్కుడుభక్తిఁ బూజింపరయ్య!

గీ॥ దైవదత్తంబులైన స్వాతంత్ర్యములను
భోగభాగ్యంబులను సమభాగమిచ్చి
సోదరీరత్నములనెల్ల నాదరించి
పుణ్యకీర్తులఁగొనరయ్య! పురుషులార: 80

సీ॥ దేశంబుమిగులవృద్ధిచక్కఁగాశుభో । దయమందమదులందుఁదలఁతురేని
మేదినిసారసమృద్ధిమై లెస్సగా । ఫలియింప మదులందుఁదలఁతురేని
కాటకంబుమశూచికముఁ గలరా ప్లేగుఁ । బొలియంగ మదులందుఁదలఁతురేని
కుంభవృష్టిగసదా గోవులుపాలీయ । నెలమితో మదులందుఁదలఁతురేని

గీ॥ బాల్యవైవాహికములను బాపరయ్యా !
బాలవిధవలకన్నీరు పడినయంత
వఱకుదేశంబులేశంబు బాగుపడదు
కానబాల్యవివాహముల్ మానరయ్యా ! 81

సీ॥ అమ్మరో ! నాపెండ్లియగుటెన్నఁడే ! యన్న । కూఁతుమాటలువిని కుంది కుంది
అవ్వరో ! నామగండెవ్వరో చెప్పుమన్న । వలవలకన్నీరు వంచి వంచి
మగఁడువచ్చునె ! చాలనగలు తెచ్చునె ! యన్న । పలుకులాకర్ణించి వగచి వగచి
వాయనంబున కల్లవారియింటికిఁ దోడ । నేగుదెంచెదనన్న నేడ్చియేడ్చి

గీ॥ తనయయవ్యక్త వాక్యముల్ తలఁచి తలఁచి
యక్కటా ! యంచు హా ! దైవమా ! యటంచు
వనఁటనొంది యలో పొలో యనుటకంటెఁ
గూనలకుఁ బెండ్లిసేయుట మానరాదె ? 82

సీ॥ కల్యాణవేళ మంగళసూత్రమును గట్టు । తఱుణంబునందు సీతాయిమగఁడు
సాపడపున్ని స్థాలీపాక మొనరించు । తఱియందె యల్ల చంద్రమ్మమగఁడు
పాకెన్న నాఁడు సంభావనల్ విప్రసం । దలికిచ్చు వేళ మీనాక్షిమగఁడు
నాకబలియొనర్చు నాఁడుసంకల్పమా।రంభించునపుడె భద్రాంబమగఁడు॥

గీ॥ పదియునాఱవ పండుగదియు మున్నె
దేవదేవిమగండు గతించెననుచు
ఉరములను మోదుకొనుచు వందుపటకంటె
గూఁతులను వృద్ధులకు నీయకుండరాదె 83.

సీ॥ పేదరైతుల నేడిపించుమస్తోద్యోగికొనఁడొకో? వందలకొలఁదిధనము
పడుప్రపనంబు. చేగడన క్షత్రియలెల్లఁ గూడఁ బెట్టరె? వేలకొలఁదిధనము
కటికితనంబుచే గాయికసాయీలు కూర్చరో? లక్షలకొలఁదిధనము
దాపులుష్ట్రిగొబల్ దారుణగతి దొంగకొనిపోఁడొకో?కోట్లకొలఁది ధనము

గీ॥ కూరుచుటకేమి ధనము ఛీ! కిరికికని
మాలినధనంబు కాల్పనే బాలికలను
దంధనంబైన ధనముకై తగవుమాలి
విక్రయింతురె కటకటా వెఱ్ఱులార 84

సీ॥ జాతులఁ గల్పించి జనుల కెల్లరకు మేల్ | చదువులఁ జెప్పక జడులఁ జేసి
కులముతక్కువవాఁడు గుణవంతుఁ డైనను | గారవింపక యుండఁ గట్టు చేసి
అబలల స్వాతంత్ర్య మపహరించి మనుష్య | గణమునఁ దక్కయుండ నణఁగఁ
ద్రొక్కి
యాచనావృత్తి మేలని పూనిపోమరి | తనముకుమ్మందు దారిఁ జూపి
గీ॥ నావికాయాత్రలను నాశనంబుఁ జేసి
దేశ మింతకుఁ దెచ్చిన ధీవరులరు
మీకుఁ గరుణయుఁ గల్గునే? మేఁకవన్నె
పింతపులులార! ఖలులార విప్రులార 85

సీ॥ బాలరండల విలాపము నాలకించిన | గండశైలంబైన గరఁగకున్నె?
బాలరండలవిలాపము నాలకించిన | బోయకైనను జాలి పుట్టకున్నె?
బాలరండల విలాపము నాలకించినఁ | గటికివానికి దయ కలుగకున్నె?
బాలరండల విలాపము నాలకించిన | ఖలుఁడైనఁ గన్నీరు గార్చకున్నె?
గీ॥ మెత్తపడకున్నదార! మీ చిత్తమెట్టి
గట్టియినుమున బలు వజ్రఖండమునను
జేసెనో గాని యల్ల రాజీవభవుఁడు
విగతకారుణ్యమతులార! విప్రులార! 86

సీ॥ అగ్నిహోత్రమునైచి యంభోధి జలమింకఁ । జేయఁబూనెడు మూఢ చిత్తుఁడైన
ఖరవాలమూఁత గాఁగైకొని పాథోధి। నీదనెంచెడు బుద్ధిహీనుఁడైన
క్షీరమేళనచేఁ బయోరాశిక్షారత। మాన్పనూహించెడు మందుఁడైన
బడబానలంబును బట్టంగఁ దలపోసి। జలధిలోనుఱుకు నజ్ఞానియైనఁ

గీ॥ క్షుద్రతరకన్యకావర శుల్కములను
బాల్యవిషమవివాహముల్ బాగటించుఁ
బలుకఁజాలఁడు మీవంటిప్రాజ్ఞులకివి
గూడవిఁకమానుఁడో బ్రహ్మకులజులార! 87

సీ॥ ఆమయంబణఁపసిద్ధౌషధంబగునంచు । విషముఁ గ్రోలఁదలంచు వెఱ్ఱియైన
ఘనమైననీరు పట్టును దీర్చుకొననెంచి। నెయిద్రావికొనునవినీతుఁడైన
నేలనింగియుఁబట్టి తాళంబువాయింప । మానసంబునఁ గోరుమందుఁడైన
బలురోసమునరొప్పు పులిమీసములఁబట్టి । వ్రేలాడఁబూనెడు జెలయైనఁ

గీ॥ క్షుద్రతరకన్య కావరశుల్కములను
బాల్యవిషమ వివాహముల్ బాగటించుఁ
బలుకఁజాలఁడు మీవంటి ప్రాజ్ఞులకివి
గూడవిఁకమానుఁడో బ్రహ్మకులజులార! 88

సీ॥ ప్రతిభార్యాపునర్వివాహములు చేయుమటంచు । శాస్త్రమెందునసైన నాజ్ఞ
యిడిరె?
వేదంబులందైన విధియింపఁ బడియెనే; । స్మృతులయందెందైనఁ జెప్పఁ
బడెనె?
మనపూర్వులెపుడైన నొనరించియుండిరే? । యేదేశమందైన నిట్టులకలదె?
ఈదేశమునసైన నెల్లవర్ణంబులు। వారొప్పి చేయుచున్నారె? యెందు

గీ॥ లోకవిపరీతమై మఱిలోకవృద్ధి
భంగకరమైన పనిచేయ భావ్యమగునె?
మదినిదయఁదాల్చి యీకీడుమాన్పరయ్య!
ధరణిసురులార! ధర్మావతారులార! 89

సీ॥ కాలానుకూలంబుగా లోకవిజ్ఞులై। సంఘసంస్కరణంబు సలుపరయ్య!
ఆంక్షలటంచుఁ బ్రాయశ్చిత్తములటంచు। లోకులబెదరింపఁ బోకుఁడయ్య
పాదభిక్షలటంచు బీదల బీడించి। విత్తంబుఁగూర్చుట విడువరయ్య!
బాలవితంతువుల్ పడునట్టిపాట్లెల్ల। నెల్లవారలకు బోధింపరయ్య!

గీ॥ మాదుదుస్సహ దుఃఖముల్ మాన్పరయ్య!
పక్షపాతంబుమీకేల? వదలరయ్య!
భూసురోత్తములార! సన్యాసులార!
ధీరవరులార! పీఠాధికారులార! 90

బాల్యంబునఁ బెండ్లియటంచుఁ దనమగం డితఁడంచు | నెంచియైనను సంతసింపవచ్చు
తమకంబుమీఱ [illegible]పలసైనఁ బెనిమిటిపొత్తున | భుజియించి ముచ్చటఁ బొందవచ్చు
అలుకపాన్పునఁ జేరునపుడైన భర్తకుఁ | దెలనాకు మడుపులందింపవచ్చు
తమిఁబునస్సంధాన సుముహూర్తమునసైనఁ | బతితోడశయ్యపైఁ బండవచ్చు॥

గీ॥ తనివి దీఱమగనిఁ గనియైన గోర్కెల్లు
మనసుకొంత దీర్చుకొనఁగవచ్చు
యువతులకు వివాహమొనరించితిర యేని,
గాన స్త్రీలఁ గరుణఁ గావరయ్య! 95

సీ॥ స్మృతిశాస్త్రశ్రుతిపురాణేతిహాసనికాయ | మిదియుక్తమంచు ఘోషించుఁ గాక
ఆబాలగోపాల మఖిల మానవకోటి | యిదిమేలటంచు భాషించుఁ గాక
బాంధవ విజహితాప్త పురోహిత శ్రేణి | యిదితప్పదంచు వేధించుఁ గాక
కలమతపరితతి యేకగ్రీవముగ నొత్తి | యిదిధర్మమంచు బోధించుఁ గాక॥

గీ॥ వెతలు తనకెన్నియో సంభవించుఁగాక
దంపతుల కెల్లదుఃఖ సంధాయకమ్ము
లైన యుద్వాహములను జేయంగరాదు
ధరణిసురులార? యీనీతిఁదలఁపరయ్య? 96

సీ॥ దైవసృష్టికి విరోధమ్ముగాదొక్కొ? నం । తతినొంద విధవఁదగదటన్నఁ
బ్రకృతి ధర్మమునకు భంగంబు గాదొక్కొ? । రండ భోగములందరా
దటన్న
నీతిదృష్టికిఁ బక్షపాతంబు గాదొక్కొ? । స్త్రీలకు మార్పెండ్లి చెల్లదన్న
నవనాగరికతకు నష్టంబు గాదొక్కొ? । యీదేశనియమంబు గాదటన్న॥
గీ॥ స్వార్థపరతను ఛాందసుల్ పల్కునట్టి
దనుజధర్మంబె నిజముగాఁదలఁపఁబోక
విధవలను సధవలను గావింతురేని
శ్రేయమగు నన్నలార! యోజింపరయ్య! 97

సీ॥ "లతకూనలను గళాన్వితలను గావించి । జ్ఞానమిచ్చుట తప్పుగాదుసుండు
తలిరుబోఁణులకు స్వాతంత్ర్యభాగ్యమొసంగి । గారవించుట తప్పు
గాదుసుండు
అతివల కీడేరునందాక వైవాహి । కమ్ముఁజేయమి తప్పుగాదుసుండు
వలసిన విధవ కుద్వాహంబుఁ గావించి । యాదరించుట తప్పుగాదుసుండు
గీ॥ విశ్వమానవసమాజంబు లీశ్వరప్ర
సాదితమౌ ఉత్తమాంగ రక్షకము లజ్జ
గంధులకుఁబ్రాణపదములై క్రాలుకేశ
ఖండనముఁ జేయమియుఁదప్పుగాదు సుండు 98

సీ॥ సంగీతమందును సాహిత్యమందును యుక్తియందును మంచి వ్యక్తియందు
జక్కఁదనమునందు జవ్వనంబందును బలమునందును బుద్ధిబలమునందు
సద్గుణంబులయందు సరసతయందును వీస మొండొరులకుఁ దీసిపోక
తనువులు రెండుగాఁ దనరుచున్నను నెల్లభావములందు నేకమగుచు॥

గీ॥ ప్రౌఢిమంబున నన్యోన్య వశ్యులగుచుఁ
జిరతరాయువు సంతతి సిరియుఁగలిగి
సౌఖ్యకీర్తుల నోలాడు సతులుఁబతులుఁ
గలిగి భారతవర్షంబు చెలఁగుఁగాక! 99

సీ॥ సద్విద్యలను నేర్పి స్వాతంత్ర్యములనిచ్చి
స్త్రీలఁ బూరుషు లాదరింతుఁగాత!
దంపతులకు సౌఖ్యదంబులై యలరారు
ప్రౌఢా వివాహముల్ ప్రబలుగాత!
విధవా వివాహముల్ విహితంబులైయొప్పి
భ్రూణహత్యలు లేకపోవుఁగాత!
యువతులు దేశోపయోగ కార్యములందు
గదిరి ముందంజ వేయుదురుగాత!

గీ॥ అసమ వైవాహికములెల్ల నణఁగుఁగాత!
కన్యకాశుల్కములు గంగఁగలియుఁగాత!
భూరివరశుల్కములు మాసిపోవుఁగాత!
ఎల్లశుభములు నిందు వర్ధిల్లుఁగాత!



# —•తప్పొప్పుల పట్టిక•—

—:0:—

| పేజీ | బంతి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 12 | 15 | విడుట | లిడుట |
| 13 | 8 | ప్రేమనుబంధంబు | ప్రేమానుబంధంబు |
| 14 | 1 | ఘుమఘుమ | ఘుమఘుమ |
| 15 | 15 | నించు | నంచు |
| 16 | 4 | దిక్కెవరు | దిక్కెవరును |
| | 9 | స్నానము | స్తానము |
| | 11 | యంచు | యందు |
| 18 | 1 | పెండ్లిడ్ల | పెండ్లిండ్ల |
| 18 | 13 | సతి | సతీ |
| 21 | 13 | పెర | పితృ |
| 24 | 11 | బ్రతుక్బ్రతుకె | బ్రతుకుబ్రతుకె |
| 30 | 3 | వాంఛ్రతో | రాంఛ్రతో |
| 34 | 14 | చిత్త | చేత |
| 42 | 12 | దారుఋట్టిగో | దారులాగొట్టి |



